Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

ఓం శ్రీ వేఙ్కటేశాయ నమః　　　　శ్రీమతే రామానుజాయ నమః



# తిరునారాయణపుర వైభవం

ఈ గ్రన్థమును గ్రన్థరత్నహారమునకు 9 వ పతకము... చేర్చితిమి.

శ్రీ యదుగిరి నాచ్చియారులు (సౌమ్యనాయకి)



శ్రీ కల్యాణితాయార్

## శ్రీ రామానుజ సుప్రభాతగోష్ఠి

స్థాపితము. 28-7-73 రిజిస్టర్డు - 206/701. P. P. 38223.
"గోవర్ధన మందిరము"
25. ఆరుముగం వీధి. మద్రాసు - 600 001 T. N.

ఓం శ్రీ వేఙ్కటేశాయనమః                    శ్రీమతే రామానుజాయనమః



శ్రీమతే రామానుజాయనమః



శ్రియఃపతి సఙ్కల్పముచే స్వామి ఎంబెరుమానారుల అనుగ్రహముచే సింహాచల దేవస్థాన అమల్‌దారైన శ్రీమాన్ ఉ॥ వే॥ శ్రీమాన్ కాంతలూరి. గోపాలకృష్ణమాచార్య స్వామివారు ఈ గ్రన్థమును మదరాసు శ్రీ వేఙ్కటేశ్వర సుప్రభాతగోష్ఠివారి శ్రీ వేఙ్కటేశ్వర మందిరమున 1-1-82 ఉదయం 9 గం॥ శ్రీమద్రామాయణ కాలక్షేపము సమయమున ఆవిష్కరించిరి. ఈ గ్రంథమును గ్రంథరత్నహారమునకు 9 వ పతకముగా చేర్చితిమి.

ఇట్లు తమ పాదదాసులు.

శ్రీ రామానుజ సుప్రభాతగోష్ఠి.

నలసినది అని నియమించిరి. కాబట్టి చరమపర్వ నిష్ఠులైన మనకు ఈ క్షేత్రవాసము అంత్యంత ప్రధానము. కావున ఈ క్షేత్ర మహాత్మ్యం మనము తప్పక తెలుసుకొని వాసము చేయవలసియున్నది.

ఈ తిరునారాయణపురమునకు క్షేత్రాదిపతి తిరునారాయణ

ఓం శ్రీ వేఙ్కటేశాయనమః        శ్రీమతే రామానుజాయనమః



# తిరునారాయణపుర వైభవం

శ్రియఃపతి సఙ్కల్పముచే స్వామి ఎంబెరుమానార్లుల అనుగ్రహముచే తిరునారాయణపుర క్షేత్ర మహాత్మ్యం స్థలపురాణం; శెల్వపిళ్ళై వైరముడి వైభవం, అష్టతీర్థమహాత్మ్యం, మన శ్రీవైష్ణవులకు ఎంత ప్రాధాన్యం అను విషయములను వివరించుదుము.

స్వామి (ఎంబెరుమానారు) పరమపదం వేంచేయునపుడు శ్రీరంగమున తమ అంతరంగ శిష్యులను పిలిచి, శ్రీవైష్ణవులు చరమ పర్వ నిష్ఠపరులు ఎలాకాలమును వెళ్ళబుచ్చవలెను? ఏ విధముగా అనుష్ఠించవలెను? అను విషయములు మొత్తమును 82 వార్తలుగా సాయించిరి. అందులో కడపటి వార్తగా వేదపారాయణం శ్రీ భాష్యం మీరు నేర్చుకోవలసినది. అధికారులకు నేర్పించ వలసినది. దివ్య ప్రబంధము మీరు నేర్చుకోవలసింది, ఎల్లరకు నేర్పించవలసినది. ఇది ఏదియును వీలుకాకపోయిననూ అడియేనుకు అభిమానస్థలమైన తిరు నారాయణపురములో ఒక గుడిసె అయినా వేసుకని కాపురం చేయ వలసినది. అని స్వామి, నియమించిరి. శ్రీ రంగనాథుడు స్వామి (రామానుజులవారిని) "అత్రైవ శ్రీ రఙ్గేసుఖమాస్వ" అని నియ మించిరి. స్వామి మనకు తిరునారాయణపురములో నివాసము చేయ వలసినది అని నియమించిరి. కాబట్టి చరమపర్వ నిష్ఠులైన మనకు ఈ క్షేత్రవాసము అంత్యంత ప్రధానము. కావున ఈ క్షేత్ర మహాత్మ్యం మనము తప్పక తెలుసుకొని వాసము చేయవలసియున్నది.

ఈ తిరునారాయణపురమునకు క్షేత్రాదిపతి తిరునారాయణ

పెరుమాళ్ (మూలవర్లు మూల విరాట్ శ్రీశన్) ఉత్సవర్లు హృదయోద్భవర్; రామప్రియన్; శెల్వనారణన్; శెల్వపిళ్ళై; రామానుజ పుత్రులు; సంపత్కుమారులు. ఉభయనాచ్చిమారులు; బీబినాంచియారులు (వరనందిని) తనిక్కోయిల్ తాయార్–మూల విరాట్ యదుగిరి నాచ్చియార్; సౌమ్యనాయకి; ఉత్సవరులు కల్యాణితాయార్. ఈ దివ్యదేశము 108 క్షేత్రములలో చేరనందున స్వామి (ఉడయవరులు) తాము అత్యంత ఆదరణ ప్రేమాభిమాన ముతో ఈ క్షేత్రమునకు, నమ్మాళ్వార్లు సాయించిన తిరువాయ్ మొళిలో 4 వ పత్తు మొదటి పదిగం॥ అయిన ఒరు నాయగమాయ్ అను 11 పాశురములను ఆళ్వార్ పాడల్ అని సమర్పించిరి. అందుచే మనకు ఈ క్షేత్రం కూడా దివ్యదేశము లెక్కలో పరిగణించ వలెను.

## తిరునారాయణ పెరుమాళ్ వేంచేసిన విధానం

శ్రియఃపతి సఙ్కల్పముచే మహా ప్రళయానంతరము క్షీరాబ్ధి నాధుని నాభినుండి ఒక తామరపువ్వు అందులో పఞ్చముఖ బ్రహ్మ ఉద్భవించిరి. ఆ బ్రహ్మతాను ఎవరు ఎందులకు పుట్టితిమి అని ఆలోచించెను. అంతట శ్రియఃపతి అతనికి చతుర్వేదములను ఉపదేశించెను. అపుడు తనకు ఆరాధనకు (పూజకు) ఒక విగ్రహం కావలెనని ప్రార్థించెను. శ్రీమన్నారాయణుడు శేషతల్ప సాయి విగ్రహమును ఇచ్చెను. ఆ మూర్తియే శ్రీరఙ్గనాథుడు. (మూలవిరాట్) వారిని బ్రహ్మ ఆరాధించుచుండెను. ఈ ఆరాధనక్రమమును శ్రియఃపతి బ్రహ్మకు 5 రాత్రులలో ఉపదేశించెను. కావున ఈ తిరువారాధనకు పాఞ్చరాత్రము అని పేరు కలిగెను. కావున ఇప్పటికి శ్రీరంగమున పాఞ్చరాత్ర ఆగమ ప్రకారము తిరువారాధన జరుగుచున్నది.

ఇక్ష్వాకు మహారాజు బ్రహ్మగురించి తపస్సుగావించగా ప్రత్యక్షమై నీకేమి కావలెనని అడిగెను. అపుడు తనకు ఆరాధించుటకు దివ్యమంగళ విగ్రహం కావలెననగా శ్రీరఙ్గనాథుని ఇచ్చెను. ఆ

రాజు అయోధ్యలో తిరువారాధనము చేయుచుండెను. అది మొదలు పెరుమాళ్ళకు ఇక్ష్వాకు కులదనం అని పేరు కలిగెను. ఆ పరంపర అయిన సూర్యవంశములో అవతరించిన శ్రీరామచంద్రమూర్తికి ఆరాధ్యదైవమయ్యెను. శ్రీరాములవారు తన పట్టాభిషేక బహు మానముగా విభీషణునకు ఇక్ష్వాకు కులధనమైన శ్రీరఙ్గనాథుని ఇచ్చెను. విభీషణుడు ఆకాశమార్గముగా ఎత్తుకొని పోవుచుండ ఈ భారత దేశమును విడుచుటకు మనసొప్పక శ్రియఃపతి మనలను రక్షించు నిమిత్తమై ఉభయకావేరి మధ్యకు వచ్చునపుడు విభీషణునకు సాయంసమయ సంధ్యావందన నిత్యకర్మకై కావేరి ఒడ్డున దిగెను. శ్రీరఙ్గసాయి అచటనే స్థిరపడెను.

బ్రహ్మ తన తిరువారాదనమూర్తిని ఇక్ష్వాకుకు ఇచ్చిన పిదప తనకు ఆరాదనకు మూర్తిలేదని మరల భగవంతుని ధ్యానించెను. అపుడు శ్రియ : పతి ఒక దివ్యమఙ్గళం నిన్ఱకోలం (నిలుచుకొనివున్న) గల మూర్తిని ఇచ్చెను. ఆ మూర్తి పేరు తిరునారాయణన్ (మూలవిరాట్టు) వీరిని ఆరాదించుచుండెను.

బ్రహ్మమానస పుత్రుడైన సనత్కుమారులు తపస్సుచేయ బ్రహ్మప్రత్యక్షమై ఏమి కావలెనని అడుగగా తనకు "మీ తిరువారాదనమూర్తి కావలెనని" అడిగెను. అపుడు ఈ మూర్తిని ఇచ్చుటకు మనస్సురాక, ఇచ్చుదనని వాక్కు ఇచ్చినందున ఇవ్వలేక ఇచ్చెను. అపుడు ఈ తిరునారాయణన్ తనహృదయమునుండి ఒక దివ్యమఙ్గళ విగ్రహము (ఉత్సవమూర్తిని)ను తీసి బ్రహ్మకిచ్చెను. కావున వుత్సవరులకు హృదయోద్భవర్ అని పేరు వచ్చెను. సన త్కుమారులు బ్రహ్మను చూచి ఈ మూర్తిని ఎచట వుంచి ఆరా ధించిన ఎక్కువ ఫలము శీఘ్రముగా భక్తులకు లభించును అని అడి గెను. అపుడు బ్రహ్మ "శ్రీ వరాహస్వామి భూమిని సముద్రము నుండి పైకి ఎత్తి నేలపై నిలిచిరి. అపుడు (శ్రీవరాహస్వామి) జ్ఞాన పిరాన్ శ్రమమునకు వారి దివ్యమఙ్గళ తిరుమేనినుండి స్వేదబిందువులు (చెమట) స్రవించెను. అది ఒక కోనేరు (కొలను, గుంట;)గా ఏర్ప

డెను. ఆ కోనేరు వేదాద్రి అనుచోట వున్నది. అచట దత్తాత్రేయ మహర్షి వేదములను పఠించునపుడు ఆఘోషప్రతిధ్వనించుచుండెను. అందుచే దానికి వేదాద్రి అని పేరుకూడా వున్నది. శ్రీవరాహ స్వామి నిలిచినందున వరహాచలమని పేరు కలదు. కావున అచట ఈమూర్తిని ప్రతిష్ఠించుము" అని బ్రహ్మ చెప్పగా ఆప్రకారమే పాఞ్చరాత్ర ఆగమశాస్త్ర ప్రకారం ఈ మూర్తిని ప్రతిష్ఠించెను. అదిమొదలు ఈ కొండకు నారాయణాద్రి అని పేరు కల్గెను. ఈవిధముగా మూలవర్లు ఈలోకమునకు వేంచేసిరి.

## శెల్వపిళ్ళై ఈక్షేత్రమునకు వేంచేసిన విధానం

శ్రీ చక్రవర్తితిరుమగన్ (రాములవారు) తన తిరువారాధన ఇక్ష్వాకు కులధనమును (శ్రీరంగనాథుని) శ్రీవిభీషణాళ్వానులకు ఇచ్చిన పిదప, తన ఆరాదనమునకు మూర్తిలేదే అని ఆలోచించి శ్రీనారదభగవానులను పిలిచి చెప్పెను. శ్రీనారదమహర్షి బ్రహ్మవద్దకు పోయి చెప్పగా బ్రహ్మ పరమసంతోషముతో శ్రీ దేవదేవునికి కదా మనము ఇచ్చుచున్నదని తలంచి తన ఆరాదన మూర్తియైన హృదయోద్భవుని ఇచ్చెను. ఆమూర్తిని నారదు లివ్వగా దాశరథి (రాములవారు) అత్యంత ప్రీతి శ్రద్ధభక్తితో ఆరాదించుచుండెను. ఇటుల పదకొండువేల సంవత్సరములు (11,000) ఆరాదించెను. శ్రీరాములవారు పరమపదం వేంచేసిరి. వారి కుమారుడైన కుశమహారాజు ఈమూర్తిని తండ్రి అత్యంత ప్రీతితో ఆరాదించినందున ఈదివ్యమఙ్గళ విగ్రహమునకు రామప్రియన్ అని పేరు పెట్టి తానునూ అదేవిధముగా ఆరాదించుచుండెను. కుశమహారాజు త్రేతాయుగము ముగిసి ద్వాపరయుగం ఆరంభించు సమయమున తన కుమార్తె అయిన కనకమాలినిని యదుకులవంశస్థులైన యదుశేఖరన్ అను రాజుకు ఇచ్చి వివాహం జరిపించెను. కన్యాదాన సమయమున సకలరత్న దనదాన్యాదులతో, తనతల్లి సీతాదేవి స్వప్నమున నీకూతురికి శ్రీరామప్రియన్‌ను శ్రీధనంగా ఇవ్వవలసినది అని చెప్పినందున తనకు పుత్రులు లేనందున శ్రీరామప్రియ

లను కూడా ఆమెకు ఇచ్చెను. ఈవిధముగా వుత్సవరులు ఇక్ష్వాకు వంశముండి యదువంశమునకు చేరిరి. ఈ వంశమున అవతరించిన శ్రీబలరామకృష్ణులు చాల అత్యంత ప్రీతిభక్తిశ్రద్ధలతో పూర్వీకుల ఆరాదనమూర్తి అని ఆరాధించుచుండిరి.

శ్రీబలరాములు తీర్థయాత్రలు చేయుచూ ఈకల్యాణి తీర్థమందు స్నానంచేసి శ్రీతిరునారాయణపెరుమాళ్ళను సేవించిరి. అంతట వీరిని సేవించుటతోనే మన గృహాతిరువారాదనపెరుమాళ్ళవలె వున్నారే ఇది ఏమి ఆశ్చర్యము అని యాత్ర ముగించి శ్రీకృష్ణులతో చెప్పిరి. అందులకు శ్రీకృష్ణులు అంగీకరించక (తనకు అది యదార్థమని తెలిసినప్పటికి) మనది ఇక్ష్వాకు వంశంనుండి వచ్చిన విగ్రహము. ఆమూర్తి బ్రహ్మ సనత్కుమారుల కిచ్చినది అని చెప్పుచుంటివి. కావున ఆమూర్తి మన విగ్రహం ఒకటిగా వుండజాలదు అని వాదించిరి. బలరాములు నిర్బంధముచేయగా ఉత్సవమూర్తిని ఎత్తుకొని ఇరువురు మేల్కోటకు వచ్చి మూర్తిని సేవించిరి. బలరాములు ఇపుడేమందువనగా నీఇష్టం అని అంగీకరించిరి. వెంటనే హృదయోద్భవులను ఇచట ప్రతిష్ఠించి, వైరముడిని సమర్పించి బ్రహ్మోత్సవము జరిపించి కొన్ని సంవత్సరములు నివసించి తదుపరి ద్వారకకు వెళ్ళి పరమపదమునకు వేంచేసిరి. యదువంశస్థులుచే వుత్సవరులను ప్రతిష్ఠించుటచే దీనికి యాదవాద్రి అని పేరు కల్గినది. ఈవిధముగా శెల్వానారణన్ యాదవాద్రి చేరి మూలవరులు వుత్సవరులు ఈసన్నిధి చేరిరి.

## వైరముడి వైభవం

క్షీరాబ్దినాథులు యోగనిద్రలో వున్నప్పుడు ప్రహ్లాదునికుమారుడైన విరోచనుడు పాలసముద్రమున కొచ్చి పెరుమాళ్ళు ధరించిన కిరీటమును తీసికొని ఉప్పు సముద్రములో దాచుకొనెను. కొంతకాలమునకు సర్వజ్ఞుడైన క్షీరాబ్ధినాథుడు యోగనిద్ర (చింతనము) ముగించి పెరియతిరువడి (గరుడాళ్వార్లు)ని పిలిచి "నా వైరముడి

కిరీటమును విరోచనుడు దొంగలించుకొనిపోయి ఉప్పుసముద్రమున వున్నాడు. అతనిని జయించి ఆవైరముడి గైకొని రమ్మనెను.

పెరియతిరువడి విరోచనుని జయించి ఆవైరముడిని ఆకాశ మార్గమున తెచ్చుచుండెను.

కిరీటము గురించి కొంత మనం తెలుసుకొనవలెను. ఈకిరీటము రెండువేల మైళ్లు వ్యాసము కలిగియుండును అని పురాణమునం దున్నది. అంత పెద్ద కిరీటము ఎక్కడైనా వుండునా అని మనకు సందేహము కలుగవచ్చును. వారికి సమాదానము ఈకిరీటము మన వంటివారు ధరించునది కాదుగదా? క్షీరాబ్ధినాథుడు ధరించినది. ఈ కిరీటము ఇంతపెద్దదైతే ఆశిరస్సు ఎంత పెద్దదిగా వుండవలె? ఆతిరు మేని ఎంత పొడుగు? అనే ప్రశ్నవచ్చును. ఈ క్షీరాబ్ధినాథుడు పాల సముద్రములో శేషునిపై పడుకొనివున్నారు. వారి పొడుగు 25 వేల మైళ్ళు అని శాస్త్రములో వర్ణించియున్నది. క్షీరాబ్ధి (పాలసము ద్రముయొక్క పొడుగు 320 లక్షల మైళ్ళు. అని వేదము వర్ణించి యున్నది. ఇన్ని చెప్పినను కొన్నిమందికి సందేహము తీరదు. అందులకు సమాధానం వైదికులు పఞ్చాఙ్గమును నమ్ముదురు. దాని ప్రకారం తిథి వారం నక్షత్రం లగ్నం అన్ని నిర్ణయించి కార్యములు జరుపుదురు. ఈ దుర్మతినామ సంవత్సర పఞ్చాఙ్గమున సంక్రాంతి పురుషుడు గాడిదపై కూర్చొనివచ్చుచున్నాడు అని వర్ణిస్తూ అతను కూర్చుంటే వెయ్యిన్ని ఐదువందల మైళ్ళు ఎత్తు వున్నాడు అని చెప్పి యున్నది. సంక్రాంతి పురుషుడు భగవంతునిచే సృష్టించబడినవాడు కూర్చుంటే ఇంత ఎత్తున వున్నాడంటే స్వరలోక రక్షకుడు 25 వేల మైళ్ల పొడుగు వుండుటలో ఆశ్చర్యములేదు. అంత పెద్ద తిరుమేనికి తగ్గ శిరస్సు అందుకుతగ్గ కిరీటము వుండును అనుటలో సందేహము పొంద నక్కరలేదు. మనము శాస్త్రములను నమ్మువారు గనుక ఇదియే ప్రమాణం.

వైరముడిని పెరియతిరువడి ఆకాశమార్గమున తెచ్చుచుండగా ఒక తేజస్సు వారి కడ్డుపడెను. ఇదేమిటని వారు క్రిందచూడగా

శ్రీకృష్ణులు బృన్దావనమున గోవులను మేపుచుండెను. అంతట పెరియ తిరువడి క్రిందకు దిగి తన స్వామిని చూచి ప్రదక్షిణంచేసి నమస్కరించెను. ఆ సౌందర్యము చూచి ముగ్ధుడయ్యెను. అపుడు పెరియ తిరువడికి ఒక ఆలోచన వచ్చెను. అదే మన ఈ వైరముడి కిరీటమును వీరికి వుంచిన ఎలావుండును. ఈ అభిప్రాయము కలిగిన వెంటనే అంత పెద్ద కిరీటము సంకోచించి శిరస్సున ధరించుటకు వీలగునట్లు అయ్యెను. అది చూచి ఆశ్చర్యపడి శ్రీకృష్ణుని శిరమున వుంచెను. అది చాల ఖచ్చితముగా సరిపడెను. అది చూచి పెరియతిరువడి అతి సంభ్రమాశ్చర్యములతో ఆనందభరితుడై ప్రదక్షిణ నమస్కారము చేసెను. కొంత సేపైన తదుపరి ఆ కిరీటము తీసి ఇమ్మని భగవంతుని ప్రార్థించెను. నీవు పెట్టితివి కాన నీవే తీసుకొనుమని చెప్పిరి. వీరు ఎంత ప్రయత్నించిననూ కిరీటము రాదయ్యెను. అపుడు వ్యాకులతచెంది ఏమిటిది? అని అడుగగా, క్షీరాబ్ధినుండి భూలోకము వచ్చిన ఈ కిరీటము మరల అచటకురాదు నాకు సమర్పింతివని క్షీరాబ్ధినాథునికి చెప్పుము అని శ్రీకృష్ణులు చెప్పిరి. దన్యోస్మి అని పెరియతిరువడి ప్రదక్షిముచేసి నమస్కరించి వెడలెను.

ఈ కిరీటము వైనతేయులు తీసుకొనివచ్చుటచే దీనికి వైరముడి అని పేరు కలిగెను. ఈకిరీటము వైరములతో (కమలములతో రవ్వలతో) వుండుటచే దీనికి వైరముడి అని పేరు కలిగెను అని పెద్దలు సాయించుదురు.

శ్రీ కృష్ణుడు తన తిరువారాదన రామప్రియునకు ఈ వైరముడి సమర్పించగా ఆ శిరమునకు తగ్గట్లు మరింత చిన్నదయ్యెను. శ్రీ బలరామకృష్ణులు రామప్రియులను ఈ క్షేత్రమున చేర్చినపుడు ఈ వైరముడిని కూడా సమర్పించిరి. శ్రీ రామప్రియులు పుట్టిన రోజైన మీనమాసం (పంగుని) పుష్యమి నక్షత్రం నాడు దీనిని దరింపజేసి గరుడవాహనముపై ఉభయనాచ్చియారులతో తిరువీధి వుత్సవం వేంచేయుదురు. ఈ వైరముడి అందమును ఆ రోజు ఈ సేవకై వచ్చు వేలకొలది జనమును ఆ వుత్సవమును నోటితో చెప్పియో, లేక

వ్రాసియో అనుభవించచాలదు. కన్నులు గలవారు నేరుగా చూచి ఆనందించవలసినదే. అపుడే మనకు నేత్రములు కలిగినందులకు ప్రయోజనము.

ఈ క్షేత్రము కృతయుగంనుండి ఉత్సవాదులతోను సేవల తోను విరాజిల్లుచుండినది.

శ్రియఃపతి సఙ్కల్పమువలన సుమారు 1200 సంవత్సరముల మునుపు తురుష్కులు దండయాత్ర ఎత్తినపుడు ఈ సన్నిధి అర్చకులు మూల విరాటు పెరుమాళ్ళకు తాయార్లకు రాతితో గర్భగృహ ద్వారము మూసివైచిరి. ఉభయ నాచ్చియారులను ఒక స్వామి తిరుమాళిగ సజ్జెహట్టి యందుగల బావిలో గూటిలో వుంచిరి రామ ప్రియులను కాపాడునంతలో తురుష్కులు బలాత్కారముగ తీసుకొని వెళ్ళిరి. వైరముడిని శ్రీ నృసింహస్వామి కొండయందు పాండవ గుహ యందుంచిరి. కొన్నాళ్ళకు గర్భగృహాముపై మట్టివానపడి గాలిచే ఇసుకచేరి పెద్ద పుట్టగా తయారయ్యేను. తురుష్కుల బాధవలన అచటి వారెల్లరు ఇంళ్లు ఖాళీచేసి గ్రామాంతరములకు వెళ్ళిపోయిరి. అందుచే అంతా అడవిగా మారిపోయెను. రాతితో తెరకట్టి నది మొదలు తిరునారాయణునకు దేవతలు 3 వేళల వచ్చి ఆరాదించుచూ వుండిరి.

శ్రీ రామానుజస్వామి మరల సన్నిధిని ప్రతిష్ఠించిన వివరము.

శ్రీ రామానుజస్వామి శ్రీ పెరుంబూదూరున కాంతిమతి కేశవ సోమ యాజి దంపతులకు కీ॥ శ॥ 1017 పింగళనామ సంవత్సరం చిత్రి ఆరుద్రా నక్షత్రం కూడిన శుభదినమందు అవతరించిరి.

పూర్వ పక్ష సిద్ధాంతమునకై యాదవప్రకాశుల వద్ద విద్యాభ్యా సించి 16 వ ఏట తంజమాంబను వివాహామాడి 3 తప్పులు చేసిన కారణంగా భార్యను వదలి సంసారమును త్యాగముచేసి అత్తిగిరి వరధుని సన్నిధిలో సన్యాస ఆశ్రమ స్వీకారం చేసి త్రిదణ్డ కాషాయ ములు ధరించి, దేవరాజులకు పెరుందేవికి సాలక్కిణర్ తీర్థము సమర్పించుచు శ్రీరఙ్గరాజ కోరికపై శ్రీరంగము చేరిరి.

శ్రీరఙ్గమున శిష్యులకు ప్రవచనము చేయుచూ తిరుక్కోటియూరు నంబివద్దకు 18 పర్యాయములు వెళ్ళి తిరుమన్త్రార్థ రహస్యార్థములు పొంది సన్నిధి గోపురంపైఎక్కి తనను ప్రార్థించిన వారికా విషయములు జెప్పి శ్రీరఙ్గమునకొచ్చి శ్రీరఙ్గని శరణాగతిపొంది "అత్రైవ శ్రీరఙ్గేసుఖమాస్వ" అని నియమనంపొంది శిష్యులకు ప్రవచనములు చేయుచూ శ్రీరఙ్గరాజ నిత్యోత్సవములు సేవించుచూ కాలం గడుపుచుండిరి.

శ్రీరఙ్గనాథులు ఇన్ని వైభవములు అనుభవించుటను చూచిన తిరునారాయణులు తనకు శ్రీరామానుజులవారి సంబంధంవలన మరల అన్ని వైభవములు వుత్సవములు అనుభవించవలెనని కోరిక కలిగినది. దీనినిబట్టి మనకు తెలియునదేమనగా శ్రీ రామానుజులవారి సంబంధం మనకేకాదు. ఆశ్రియఃపతికి కూడా కావలసియున్నది. చిదంబరమున కుళోత్తుంగ చోళమహారాజు వీరశైవుడై విష్ణుద్వేషియై భాగవతులను హింసించుచుండెను. అతని మంత్రి నాలురాన్ ప్రోద్బలము వలన శివాత్పరతరం నాస్తి అని వ్రాసి దాని క్రింద శ్రీరామానుజుల వారు చేవ్రాలు చేసిన చాలు అని చెప్పుటచే ఆ రాజు సేవకులను శ్రీరంగమునకు పంపగా కూరత్తాళ్వానులు పెరియనంబి వెళ్ళిరి. వీరు రామానుజులవారు కాదని మరల నాలురాన్ సేవకులను శ్రీరంగమునకు పంపెను. ఇంతలో కూరత్తాళ్వానులు వెళ్లిన విషయం తెలిసిన స్వామి తాను రాజసభకు వెళ్ళెదననగా శిష్యులు ఇపుడు సమయము కాదు. మీరు పశమటి దిశగా వేంచేయండి తదుపరి సమయంచూసి రావచ్చునని ప్రార్థింపగా అంగీకరించి తొండన్నూరుకు వేంచేసిరి.

తొండనూర్ రాజైన బిట్టి దేవరాజు కూతురికి పిశాచము పట్టియుండెను. ఏవిధ వైద్యమునకు మంత్రములకు అది వెడలకుండెను. శ్రీరామానుజులవారు ఆ సమయమున ఆ రాజ్యమునకు వచ్చిన విషయమును కొంతమంది రాజుకు తెలిపించి ఇంతకుమునుపు కంచిరాజు కూతురుకు పట్టివున్న పిశాచమును తన శ్రీపాద తీర్థ

ముతో వెడలగొట్టిరి. కావున వారు మీ కుమార్తెకు పట్టిన పిశాచ మును వెడలగొట్టగలరు. అని చెప్పిరి. అంతట రాజు పిలిపించగా సభకు స్వామి వేంచేసిరి. వీరి ముఖవర్చస్సు చూచిన రాజు అత్యాశ్చర్యచకితుడై తాను జైనుల శిష్యుడైనప్పటికి సాష్టాంగముగ నమస్కరించి ఆహ్వానించెను. స్వామి రాజపుత్రి పిశాచమును పారద్రోలిరి. రాజు మహదానందభరితుడై తానుకూడా మీ శిష్యుడయ్యెద ననెను. కాని అతని పూర్వమత గురువులు వెయ్యిమంది జైనులు అడ్డుపడగా వారిని ఏక కాలములో వాదములో జయించి వారందరినికూడా శిష్యులుగా చేసుకొని ఈ రాజుకు విష్ణువర్ధన (మహారాజు) దాసు అని వైష్ణవదాస్యనామ మిచ్చిరి.

స్వామి తొండనూర్‌లో వేంచేసియుండగా తిరుమణ్ కొఱప్పు అయిపోయినది. అయ్యో ఊర్ధ్వపుండ్రమునకు ఎలాగా అని స్వామి చింతించుచుండగా ఆ రాత్రి స్వప్నమున తిరునారాయణులు వేంచేసి "ఇచటనుండి 10 మైళ్ళదూరములో నేను వున్నాను. ఆ సన్నిధి యంతయు మూయబడి వున్నది. నీవువచ్చి మరల ప్రతిష్ఠించవలసినది" అచటనే తిరుమణ్ నీకు లభ్యమగును. అని చెప్పి అంతర్ధానమయిరి.

స్వామి అత్యంత సంతోషముతో నిద్రలేచి రాజుకు తెలిపించి పరివారము వెంటబెట్టుకొని అరణ్యమునగల చెట్లును కొట్టించి దారి చేయించి వెళ్ళిరి. అటుల వెళ్ళునపుడు దారిలో చెట్లు కొమ్మలు స్వామివారికి తగిలి గీచుకుపోయినది. అందులకు నిదర్శనముగా ఇపుడు ఇచట వేంచేసివున్న శ్రీ రామానుజస్వామి వుత్సవ విగ్రహమున ఆచారలు, మచ్చ కనుబడును. తిరుమంజన కాలములో వెనుకభాగమున వెళ్ళిచూచిన ఈ దృశ్యము ఇప్పటికి చూడవచ్చును. అంత శ్రమపడి వేంచేసి వెతుకగా ఎక్కడను గర్భగృహము కనబడలేదు. ఆ రాత్రంతయు స్వామి మిగుల చింతతో శియఃపతి చెప్పియు మనము కనుగొనలేక పోతిమే అనుకొనుచూ

నిదురించిరి. ఆ రాత్రి స్వప్నమున మరల తిరునారణన్ వేంచేసి నా గర్భగృహము, పుట్టచే కప్పబడివున్నది. అచట సంపెంగ చెట్టు వున్నది దానికి ఉత్తరముగా 30 అడుగుల దూరముననూ బదరీ వృక్షము (రేగుపండ్ల చెట్టు)నకు సూటిగా పడమటగనూ పుట్ట వున్నది. దానిని తీయించిన నా సన్నిధి కనబడును'' అని చెప్పిరి.

స్వామి మరునాడు రాజునుకూడా పిలుచుకొని వెళ్ళి సంపెంగ చెట్టుకు సమీపమున పుట్టనుగాంచి పుట్ట అనగా పాముల నివాస స్థలము కావున కొట్టరాదని తలంచి పాలు తైరు తెప్పించి ఆ పుట్టపై చేర్చగా (పోయగా) పుట్ట, మన్ను కరిగి గర్భగృహము కనబడినది. స్వామి, రాజు పరివారము, శిష్యులు అందరూ అత్యంత ఆశ్చర్య చకితులైరి. గర్భగృహ ముందుభాగమున గల రాళ్ళను తీసివేయించి తిరునారాయణుని సేవించి ఆనందించిరి. వెంటనే తైనెల పునర్వసు నక్షత్ర శుభదినమందు పాఞ్చరాత్ర ఆగమశాస్త్రప్రకారం మరల ప్రతిష్ఠించి. స్వామి తమ శ్రీ హస్తములద్వారా తిరునారాయణునకు 3 రోజులు తిరువారాధన సమర్పించిరి. ఇందులకు నిదర్శనముగా స్వామి వుత్సవమూర్తి శ్రీహస్తములందు పవిత్రములు ధరించి వున్నారు. తిరుమంజనకాలమున ఇవి సేవించవచ్చును.

తైపునర్వసు నాటికి ఇప్పటికినీ స్వామి వుత్సవమూర్తిని తిరు నారాయణ గర్భగృహమునకు వేంచేపుచేసి ఆకాలం స్వామి తిరు వారాదనము చేసిన విధముగా అనుష్ఠించుచున్నారు. స్వామియే తిరువాదనముచేసి రనుటకు నిదర్శనముగా ఇప్పటికి మొదట, సన్ని ధిలో స్వామికి విశ్వరూప సేవ తిరువారాధన జరుగును. కుంభహారతి ద్వారా స్వామియే వేంచేసి తిరువారాధన చేసినట్లు స్వామికి కుంభ హారతి అయి దానిని తిరునారాయణుల సన్నిధికి తీసుకొని వెళ్ళినపిదప శ్రీ యదుగిరీశ సుప్రభాతం, విశ్వరూపం, తిరువారాధనం జరుగు చున్నది. 108 దివ్యదేశములకంటే ఈక్షేత్రమునకు గొప్ప ఏమనగా స్వామి శ్రీహస్తములద్వారా తిరునారాయణులు శెల్వపిళ్ళై తిరువా

రాధనము చేసుకొనుటయే. స్వామి ఇక ఏ దివ్యదేశములోను మూలవరులకుగాని వుత్సవరులకుగావి తిరువారాధన చేయలేదు. కనుక ఈక్షేత్రమే మనకు ప్రధానము.

స్వామి సన్నిధి ప్రతిష్ఠించి అయిన పిదప ఈమూర్తికి బ్రహ్మోత్సవము చేయించిన బాగుండును. కాని వుత్సవమూర్తి లేదే అని, ఒక విగ్రహం చేయించుదమా అని ఆలోచించుచూ శయనించిరి. ఆ రాత్రి రామప్రియులు స్వప్నమున వేంచేసి "నేను ఢిల్లి పాదుషా వద్ద వున్నాను. నన్ను తీసుకొని రావలసింది వేరే విగ్రహం చేయ వద్దు" అని సాయించిరి. స్వామి ఈవిషయం రాజుకు తెలిపించి, పరివారములతో, స్వామి, శిష్యులు ఎల్లరూ ఢిల్లికి పయనించిరి.

స్వామి ఢిల్లిపాదుషాను చూడ సభకుపోగా, ఆపాదుషా వీరి తేజస్సుచూచి అత్యాశ్చర్యము చెంది మీకేమి కావలెననగా "మీ పూర్వీకులు మా ఆరాధన విగ్రహమును ఒకదానిని కొల్లగొట్టి తెచ్చి యున్నారు. ఆవిగ్రహం కావలెను" అని అడిగిరి. మావద్ద వున్నట్లు మీకెలా తెలుసుననగా శ్రీరామప్రియుల స్వప్నవృత్తాంతమును తిరునారాయణపుర వృత్తాంతమును చెప్పిరి. ఆపాదుషా తనమంత్రిని పిలిచి ఆకొటారములో వున్న విగ్రహములు చూపించుము. వారికి కావలసినది వారు ఎత్తుకొందురు అని ఆజ్ఞాపించెను. వీరు ఆగది యంతయూ వెతికిరి. కాని రాత్రి స్వప్నమున సాయించిన దివ్య మఙ్గళ విగ్రహంగా ఏదీ కనపడలేదు. అంతట చాల చింతతో ఇచట మావిగ్రహం లేదని బయటకొచ్చి రాజుకు చెప్పిరి. ఇవాళ ప్రొద్దు పోయినది. మరల రేపొకమారు వచ్చి చూతమని వెళ్ళిరి.

స్వామికి ఆ రాత్రి స్వప్నమున హృదయోద్భవులు వేంచేసి "నేను పాదుషా కూతురు వరనందిని అంతపురమున వున్నాను. నీవు అడిగి తీసుకొనవలసినది" అని చెప్పిరి. స్వామి మరునాడు పాదుషాను అడుగగా అంతఃపురమునకు మీరు వెళ్ళలేరు కదా అచట వున్నదని మీకెలా తెలిసినదని అడుగగా ఆ రాత్రి స్వప్నవృత్తాంతమును

తెల్పిరి. రాజు చాల ఆశ్చర్యపడి అంతఃపురమునవున్న వస్తువులకు మాకు స్వాంతము లేదు. అయిననూ మీకు ఇస్తానని మాట ఇచ్చి నందున అడిగి చూతును. అని అంతఃపురమునకు చెప్పి పంపిరి. వర నందిని నాకు ఆడుకునే బొమ్మ ఇది. దీనిని వదలి వుండలేను అని సమాధానము పంపెను. ఆ రాజు మరల తానే స్వయముగా వెళ్ళి కుమార్తెతో జరిగిన వృత్తాంత మంతయు జెప్పి నీవు ఆ విగ్రహామును వారికిమ్ము. మన వుగ్రాణములో ఇంకనూ చాల విగ్రహాములున్నవి. అందులో నీకు కావలసినది ఎత్తుకొనవచ్చునని చెప్పెను. నాకు వేరే విగ్రహాం అక్కర లేదు. నాకు ఇదే కావలెను. అని పట్టుబట్టెను. అంతట పాదుషా ఒక వుపాయమాలోచించి ఈ విగ్రహాం వారిదను చున్నారు కదా అలా అయితే వారిని పిలవమందుము ఈ విగ్రహాము వారి వద్దకు వెళ్ళినవారు ఎత్తుకొని పోనిమ్ము. విగ్రహాం కదలదుకదా? అందుచే మనము మాట తప్పినవారముకాము అనెను. అందులకు కూతురు సమ్మతించెను. స్వామికి ఈ విషయము తెలుపగా అంతః పురము బయట వేంచేసి, శ్రీకృష్ణుని యశోదా వరుగ వరుగ విజ్జే వామననమ్బా వరుగ విజ్జే అని పిలిచినట్లు స్వామి హృదయమున రామప్రియుని ధ్యానించి నీవు రమ్మనగా వచ్చినవాడను నేను. కావున ఇపుడు నేను రమ్మనగానే నీవు రావలసింది అని స్మరించి ఎన్ శెల్ల పిళ్ళాయ్ (నా సంపత్కుమారా) అని ప్రీతిగా భక్తిగా పిలిచిరి. వెంటనే వరనందిని అంతఃపురము మంచముపై వున్న శెల్వానారణన్ చిన్న బాలకునివలె అయి అందెలు గజ్జలు మువ్వలు ఘల్లు ఘల్లుమన నృత్యము చేయునట్లు తప్పటడుగులు వేయుచూ పరుగు పరుగునవచ్చి స్వామి ఒడిలో కూర్చొనిరి. ఈ వింత దృశ్యము చూచి పాదుషా, వరనందిని, శిష్యులు, పరివారములు అందరు సంభ్రమాశ్చర్యములతో మునిగిరి. స్వామి వెంటనే శెల్వపిళ్ళైను తీసుకొని అత్యవసరముగా మేల్కోటకు వేంచేసి. ప్రతిష్ఠించిరి.

వరనందిని శెల్వపిళ్ళైను వదలి వుండలేక తానుకూడా మేల్కోట వెళ్లవలెనని చెప్పెను. అందులకు పాదుషా నీవు మనిషి

అది విగ్రహం నీవు పోయి అచట ఏమిచేయుదువు. కూడా మనం బయటకు వెళ్ళరాదు. ఘోషాకదా అని చెప్పెను. ఏమి చెప్పినను వినక అన్నాహారాదులు భుజించక నిదురించక ఏడ్చుచుండెను. కుమార్తె దుఃఖము చూడలేక తన కుమారుని తోడుచేసి పల్లకిలో కూర్చుండబెట్టి పంపించెను. వారు మేల్కోట సన్నిధి ద్వారమువద్ద పల్లకి దించిరి. అన్న తలుపుతీసి చూడగా అందులో వరనందిని లేదు. ఏమి ఆశ్చర్యమని చూడగా శ్రీ శెల్వపిళ్ళై రెండు పాదముల మధ్య విగ్రహరూపముగా మారి వేంచేసియుండిరి. స్వామియూ ఏమి ఆశ్చర్యము ఒక తులుకస్త్రీకి హిందు విగ్రహంపై ఇంత వ్యామోహమా భక్తియా అని అచ్చరునొంది తన జ్ఞానదృష్టిచే చూచిరి. అపుడు "శ్రీ నారదమహర్షి ఒక తామరపువ్వును దేవలోకమునుండి తీసుకొని వచ్చి ఢిల్లీపాదుషా తోటయందుంచగా ఆ పద్మమును పాదుషా భార్య వాసనచూచెను. ఆఘ్రాణించుట ద్వారా శ్రీ మహాలక్ష్మి ఆమె గర్భమున చేరెను. అంతియేకాని, పాదుషా సంబంధమువలన కాదని తెలుసుకొని కావుననే ఈమె వారి పాదములందు చేరినది" అని తెలుసుకొని వీరికి బీబినాంచారమ్మ అని నామకరణము చేసిరి.

ఈ విషయమంతయూ కుమారునిద్వారా తెలుసుకొన్న పాదుషా తానే స్వయముగా వచ్చి సేవించి కట్నకానుకలు రాజ్యములను సమర్పించి వెళ్ళిరి.

స్వామి తమ జ్ఞానదృష్టితో సజ్జెహట్టి వారి భావిలోవున్న ఉభయ నాచ్చిమారులను, సంపెంగచెట్టు క్రింద వున్న యదుగిరి నాచ్చియారులను నరసింహస్వామి కొండయందుగల పాండవ గుహ యందున్న వైరముడిని తెప్పించి ప్రతిష్ఠించిరి. తిరునారాయణులకు రక్షకముగా, మహాశక్తి కూడిన సుదర్శన ఆళ్వారులను, పరమపద నాథుని సన్నిధి, అందులో పదిమంది ఆళ్వారులు, ప్రతిష్ఠించిరి. తమకు అత్యంత ఆదరాభిభూతులైన తిరుక్కచ్చినంబిని, శ్రీమన్నాదమునులు, శ్రీ ఆళవందారులను ప్రతిష్ఠించిరి. నిత్యోత్సవ, వారోత్సవ పక్షో

త్సవ, మాసోత్సవ, ఋతోత్సవ, అయనోత్సవ, సంవత్సరోత్సవ, కల్యాణోత్సవ, అభిషేకోత్సవ, పఞ్చపర్వోత్సవ, బ్రహ్మోత్సవ, పవిత్రోత్సవ, తిరునక్షత్రోత్సవములను అన్నిటిని ఏర్పరిచిరి. స్వామి ఈ దివ్యదేశమునకు ఆళ్వార్ గళుడయ పాడల్ లేదే అని చింతించి నమ్మాళ్వారుల ప్రబంధమైన తిరువాయ్ మొళి 4 పత్తున ఒకటవ పదిగము ఒరునాయగమాయ్ అను 11 పాశురములు సమర్పించిరి.

* ఒరునాయకమాయ్, ఓడవులకుడనాణ్డవర్ ।
కరునాయ్ కవర్ న్దకాలర్, శితైకియపానైయర్ ।
పెరునాడు కాణ, ఇమ్మైయిలే పిచ్చైతామ్ కొళ్వార్ ।
తిరునారణన్ తాళ్, కాలమ్బెఱచ్చిన్దిత్తుయ్ మినో. ౧

ఉయ్ మ్మిన్ తిఱైకొణర్ న్దు, ఎన్ఱులకాణ్డవర్ । ఇమ్మైయే
తమ్మిన్ శువై మడవారై, ప్పిఱర్ కొళ్ళత్తామ్ విట్టు ।
వెమ్మినొలి వెయ్యిల్, కానకమ్ పోయ్ కుమైతిన్బర్ కళ్ ।
శెమ్మిన్ ముడి త్తిరుమాలై, విరైన్దడి శేర్మినో. ౨

అడిశేర్ ముడియినరాకి, అరశర్ కళ్ తామ్ తొళ ।
ఇడిశేర్ మురశజ్గళ్, ముఱ్ఱ త్తియమ్బవిరున్దవర్ ।
పొడిశేర్ తుకళాయ్ ప్పోవర్ కళ్, ఆతలిల్ నొక్కెన ।
కడిశేర్ తుళాయ్ ముడి, క్కణ్ణన్ కళల్ కళ్ నినైమినో. 3

నినైప్పాన్ పుకిల్, కడలెక్కలిల్ నుణ్మణలిల్ పలర్ ।
ఎనైత్తోరుకజ్గళుమ్, ఇవ్వులకాణ్డుక న్దవర్ ।
మనైప్పాల్ మరుజ్గఱ, మాయ్ తల్ అల్లాల్ మఱ్ఱుక్కణ్డిలమ్ ।
పనైత్తాళ్ మతకళిఱట్టవన్, పాతమ్ పణిమినో. ౪

పణిమిన్ తిరువరుళెన్నుమ్, అఞ్జీతపైమ్పూమ్బళ్ళి ।
అణిమెన్కుళలార్, ఇన్బకలవియముతుణ్డార్ ।
తుణిమున్బునాల, ప్పల్లేళైయర్ తామిళిప్పచ్చెల్వర్ ।
మణిమిన్ను మేని, నమ్మాయవనేర్ శొల్లి వాళ్మినో. ౫

వాఴ్ న్దార్ కళ్ వాఴ్ న్దతు, మామఴై మొక్కులిల్ మాయ్ న్దు
[మాయ్ న్దు ।

ఆఴ్ న్దారెన్ఱల్లాల్, అన్ఱుముతలిన్ఱుఱుతియా ।
వాఴ్ న్దార్ కళ్ వాఴ్ న్దేనిఱ్పర్, ఎన్బతిల్లైనిఱ్కుఱ్ఱిల్ ।
ఆఴ్ న్దార్ కడఱ్పళ్ళి, అణ్ణలడియవరామినో. ౬

ఆమిన్ శువైయవై, ఆఱోడడిశిలుణ్డార్ న్దపిన్ ।
తూమెన్మొఴిమడవారిరక్క, ప్పిన్నుమ్ తుఱ్ఱువార్ ।
ఈమినెమక్కొరుతుఱ్ఱెన్ఱు, ఇడఱువరాతలిల్ ।
కోమిన్ తుఴాయ్ ముడి, ఆతియఞ్జోతికుణఙ్గళే. ౭

కుణఙ్గొళ్ నిఱైపుకఴ్ మన్నర్, కొడైక్కడన్ పూణ్డిరున్దు ।
ఇణఙ్గియులకుడనాక్కిలుమ్, ఆఙ్గవనైయిల్లార్ ।
మణఙ్గొణ్డపోకత్తుమన్నియుమ్, మీళ్ వర్ కళ్ మీళ్విల్లై ।
పణఙ్గొళరవణైయాన్, తిరునామమ్పడిమినో. ౮

పడిమన్ను పల్ కలన్, పఱ్ఱోడఱుత్తు ఐమ్బులన్వెన్ఱు ।
శెడిమన్ను కాయమ్ శెఱ్ఱార్ కళుమ్, ఆఙ్గవనైయిల్లార్ ।
కుడిమన్ను మిన్ శువర్క్కమెయ్ తియుమ్, మీళ్వర్ కళ్ మీళ్విల్లై ।
కొడిమన్ను పుళ్ళుడై, అణ్ణల్ కఴల్ కళ్ కుఱుకుమినో. ౯

కుఱుక మికవుణర్వత్తొడునోక్కి, యెల్లామ్విట్ట ।
ఇఱుకలిఱప్పెన్నుమ్ఞానిక్కుమ్, అప్పయనిల్లైయేల్ ।
శిఱుకనినైవతోర్ పాశముణ్డామ్, పిన్నుమ్వీడిల్లై ।
మఱుకలిలీశనైప్పఱ్ఱి, విడావిడిల్ వీడ.·. తే. ౧౦

* అ.·. తేయుయ్యప్పుకుమాఱెన్ఱు, కణ్ణన్ కఴల్ కళ్ మేల్ ।
కొయ్ పూమ్బొఴిల్ శూఴ్, కురుకూర్చ్చడకోపన్ కుఱ్ఱేవల్ ।
శెయ్ కోలత్తాయిరమ్, శీర్త్తొడైప్పాడలివైపత్తుమ్ ।
అ.·.కామల్ కఱ్పవర్, ఆఴ్ తుయర్ పోయుయ్యప్పాలరే. ౧౧

ఆఴ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.

ఆళ్వారులు ఈ పదిగంన ఒకటినుండి 8వ పాశురం వరకు ఐశ్వర్య కామములను 9వ పాశురంలో స్వర్గాది భోగ కామములను 10వ పాశురంలో కైవల్యాది భోగములను వదలి తిరు నారాయణులను ఆశ్రయించండి అని సాయించిరి. ఈ విషయమును సూచించుటకు సన్నిధి రాజగోపురం వద్ద ఒక బలిపీఠం వున్నది. అంతవరకు నేను నాది అనే అహంకారము ఐశ్వర్య కామమును బలి చేసి (వదలుకొని) రాజగోపురంలోనికి వెళ్ళవలెను. ఇక 9వ పాశుర మున సాయించిన స్వర్గాది కామములను, ప్రాకారము లోపల గల రెండవ బలిపీఠం వద్ద బలిచేయవలెను (వదలవలెను.) ఇక 10వ పాశురములో చెప్పిన కైవల్యాది భోగకామములను నాకు ఆనందము నకు అను కోరికలను ద్వజస్తంభమువద్ద వున్న బలిపీఠం వద్ద బలి చేయవలెను. (వదలవలెను.) 11వ పాశురమున ఆళ్వార్ పొందిన విధముగా భగవంతుని సేవించవలెను.

స్వామి, మూలవిరాటుకు తిరునారాయణన్ అని, వుత్సవరులకు శెల్వనారణన్, అని, తిరుమంజన బేరము (మూర్తికి) నకు వణ్ పుగళ్ నారణన్ అని, బలిబేరమునకు (విగ్రహము) వాళ్ పుగళ్ నారణన్, శయనబేరమునకు నన్ఱెళిల్ నారణన్ అని నమ్మాళ్వారులు సాయించిన పాశుర నామధేయములను సమర్పించిరి.

ఈ వుత్సవాదులు సక్రమముగా జరిపించుచూ, శిష్యులకు హితబోధనలు చేయుచూ, శ్రీ బాష్యం శాత్తుమరి చేసిరి. స్వామి తమ 91 టవ వయస్సున ఇచట వేంచేసి 102వ సంవత్సరము వరకు వాసము చేసిరి. ఒకనాడు కల్యాణిలో తీర్థమాడి తిరుమణ్ కాప్పు సమర్పించుకొను సమయమున శ్రీరంగం నుండి ఇద్దరు శ్రీ వైష్ణ వులు వేంచేసి స్వామికి సాష్టాజ్ఞముగ నమస్కరించి క్రిమికణ్ఠచోళు డనే కుళోత్తుంగుడు చనిపోయెను అని చెప్పిరి. అపుడు స్వామి మహదానంద భరితులై ఆ తీర్థమును చూచి కల్యాణి, కల్యాణిదాన్ అని మఙ్గళాశాసనము చేసిరి. ఇచట కొన్నిమందికి సందేహము

రావచ్చును. కల్యాణం అనగా శుభము అని అర్థం ఒకడు చని పోయెను అని తెలిసిన అది శుభమెట్లు అగును అని. సమాధానము- సాధారణమైతే ఈ వార్త అశుభమే. కాని కుళోత్తుంగ-చోళుడు మహాపాపి. ఎంతటి పాపి అనగా శ్రీవైష్ణవులను హింసించి భాగవత అపచారము పొందెను. పెరియనంబి ప్రాణములు పోవుటకు కారకు డయ్యెను. మహాజ్ఞాని అయిన కూరత్తాళ్వానులుకు నేత్రములు పోవు టకు హేతువయ్యెను. ఇటువంటి భగవదపచార భాగవత అపచార ఆచార్య అపచార్య అసహ్యాపచారములు చేసిన అటువంటి మహా పాపి పోవుటవలన క్షేమమే కాని నష్టం కాదు.

ఈ కుళోత్తుంగుడు నోటితో శివాత్పరతరం నాస్తి అని వాదించినందున అతని కంఠమున పురుగులు చేరి అన్న ఆహారాదులు తినలేక నానా బాధలుపడి శ్రీవైష్ణవులకు చేసిన అపచారములకు ఫలితముగా బాధలుపడి మరణించెను. ఇతని కంఠమున క్రిములు చేరినందున అది మొదలు క్రిమికణ్ఠచోళుడు అని పేరు కలిగెను. ఇతను చనిపోయినది శ్రీరఙ్గశ్రీకి మరల అభివృద్ధి కలుగుటచే ఇది శుభవార్తయే. కావున స్వామి కల్యాణి తీర్థమును సార్థక నామధేయమని ఆశీర్వదించిరి.

స్వామి సన్నిధికి వేంచేసి తిరునారాయణుని వద్ద నియమనం తీసుకొని బయలుదేఱ తలంచగా యాదవాద్రి వాసులందరూ, దేవర వారితోటి మేమూ శ్రీరంగం వచ్చెదమనిరి అపుడు స్వామి అందరూ వస్తే సన్నిధి తిరువారాదన ఎలా? వుత్సవాదులెలా? అని చెప్పి ఎవరూ రాకూడదు మీరందరూ ఇచటనే వుండవలసినది అని సాయించిరి. అందులకు వారందరూ దేవర వారిని వదిలి వుండలేము కావున మీతో వచ్చెదమని పట్టుబట్టిరి. అపుడు స్వామి అంతే కదా నన్ను వదలి వుండనక్కఱ లేకుండా నా వలె విగ్రహం చేసి ఇస్తాను. సేవించుకుంటూ వుండండి అనిరి. మీరు అయితే కాలక్షేపం సాయి స్తారు. మాట్లాడుతారు విగ్రహం పెట్టుకొని మేము ఏమి చేసేది?



తిరునారాయణపురమున స్వామి ఎంబెరుమానారుల కాలములో తమ శ్రీ హస్తములచేత ప్రతిష్ఠించిన దివ్యమఙ్గళవిగ్రహము తానుగన్ద తిరుమేని అయిన శ్రీ రామానుజులవారు. కణ్ఠమునుండి రెండుభుజములపై వున్న పొగడపూలమాలె, రెండు అంజలి హస్తములలో పవిత్రములతో సేవ.

ఓం శ్రీ వేఙ్కటేశాయ నమః

# శ్రీ వేఙ్కటేశ్వర సుప్రభాత గోష్ఠి

"శ్రీ వేఙ్కటేశ్వర మందిరము"

స్థాపితము: 1-9-1959. రిజిష్టర్డు: 16/62. P. P. ఫోను: 26164.

114, వరదాముత్తియప్పన్ వీధి, మద్రాసు-600 001, T.N.

శ్రియః పతి సఙ్కల్పముచే స్వామి ఎంబెరుమానారుల అనుగ్రహముచే మా మందిరమున ప్రతిదినం ఉదయం 6-30 గం.లకు శ్రీ వేఙ్కటేశ్వర సుప్రభాతము, శ్రీ మద్భగవద్గీతా ఒక అద్యాయం శ్రీ అష్టలక్ష్మిస్తోత్రం, ఆళ్వారాచార్యుల స్తోత్రములు, దివ్యప్రబంధ ములు, ఆయా తిరునక్షత్ర వుత్సవములు సేవించుదుము. ఇవి గాక బాలబాలికలకు ప్రతిఆదివారం, మంగళవారం, గురువారంనాడు స్తోత్రపాఠములు, దివ్యప్రబంధములు ఉచితముగా నేర్పించుదుము. సోమవారం, బుధవారం, శనివారం ఈ 3 రోజులు స్త్రీ, పురుషులకు, నాలాయిర దివ్యప్రబంధము ఉచితముగా నేర్పించుచున్నాము. మా మా మందిరము వెనుక వున్న స్థలమున నూతనముగా ప్రార్థనా మణ్డపము కట్టుచున్నాము. ఇది గనుక పూర్తి అయినచో సుమారు వెయ్యిన్ని ఐదువందలమంది భక్తులు కూర్చొని సేవించుకొనవచ్చును. ఈ మణ్డపము కట్టుటకు ఇంకనూ రెండు లక్షల రూపాయలుకావలసి యున్నది. కావున భక్తులు పైవిలాసమునకు శ్రీ వేఙ్కటేశ్వర సుప్రభాత గోష్ఠి అనే పేరుతో మనియార్డరుగాని, చెక్కులుగాని. (D. D.) డ్రాఫ్టులుగాని పంపి, మీరు రసీదు పొందవలసినది. రూ. 500/-లకు పైగా సమర్పించిన దాతల నామదేయములు శిలా సాసనములందు చెక్కించి మా ప్రార్థనమందిరమున వుంచుదుము. ఇంకనూ వివరము తెలుసుకొనగోరువారు పై అడ్రస్సుకు వుత్తరము ద్వారా గాని, నేరుగాగాని సంప్రదించి తెలుసుకొనవలసినదిగా ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

SRI VENKATESWARA SUPRABHATA GOSHTI

అనిరి అపుడు స్వామి ఎవరు ప్రీతిగా పిలుస్తారో వారితో మాట్లా డెదను అని సాయించిరి. అందులకు అందరూ సమ్మతించిరి. అపుడు స్వామి తనవలె విగ్రహం చేయించి ప్రతిష్ఠించిరి. అందు తమ శక్తిని ఆవాహన చేసిరి. ఇపుడు పిలవండి విగ్రహం పలుకును అనగా అర్చకులు అరుళప్పాడు నమ్మిరామానుజన్ అని సాయించిరి. సన్నిధిలో నుండి స్వామి విగ్రహము "నాయందేన్ నాయన్దేన్" అని శబ్దము వచ్చినది. అంతట ఎల్లరూ పరమతృప్తి చెందిరి. ఇప్పటికి నీ స్వామిని ప్రీతి శ్రద్ధలతో పిలిచితే వారికి బదులు సాయిస్తున్నారు. ఇది ప్రత్యక్షము.

స్వామి సన్నిధిసర్వవిధ కైంకర్యములు నిర్విఘ్నముగా విశేషముగా జరుగుటకు 52 కుటుంబస్థులను ఏర్పరిచిరి. స్వామి ఐంబత్తిరువర్ (52 కుటుంబస్థులు)ను పిలిచి శ్రీశైల్వపిళ్ళైను బావి గట్టుపైవున్న బిడ్డను తల్లి చూచుకొనునట్లు మీరు చూచుకొవ వలసింది అని సాయించిరి. అనగా బావి గట్టుపై బిడ్డను ఏ తల్లి కూర్చొనిపెట్టదు. అయితే పిల్లవాడు మారాంచేస్తే ఆ బిడ్డను గట్టిగా పట్టుకొని బావిలోకి చూపించి ఆనందింప జేస్తుంది. అలా మీరు శెల్వపిళ్ళైకు అన్ని వుత్సవాదులు తిరువీధి పొరప్పాడును జరిపించ వలసినదే, అదే సమయమున చాల జాగరూకతో గమనించుచూ ఏ ప్రక్కన ఏ విధమైన ఆపద రాకుండా చూచుకొనవలసినది అని సాయించిరి. ఆ ప్రకారమే ఇప్పటికీ అర్చక పరిచారకులు సర్వవిధ కైంకర్యములు నిర్విఘ్నముగ అతి శ్రద్ధాభక్తులతో చేయుచున్నారు. ఎవరెవరు ఏమే కైంకర్యము చేయవలెనో వారు వారు వారి వారి టయింప్రకారం హాజరై కైంకర్యములు జరిపించుచున్నారు. ప్రస్తుతము వున్న శ్రీ సంపత్కుమార అర్చకులు వారి కుమారులు ముగ్గురు అతి శ్రద్ధాభక్తులతో తిరువారాధనము సమర్పించు చున్నారు. నామ మాయిరం ఏత్తనిన్ననారణా అని మఙ్గళా శాసనము చేసి యుండుటచే ప్రతిదినము ఉదయం సాయంత్రం శ్రీ విష్ణు సహస్రనామావళితో 1/2 గంటకాలము తిరుత్తుళాయ్‌తో అర్చన

చేయుచున్నారు. తిరువారాధన క్రమము హారతులిచ్చుట నేరుగా సేవించవలనే తప్ప వ్రాసియో చెప్పియో తీరే విషయం కాదు.

కృతయుగమున వరాహస్వామి భూదేవికి ఇచట వరహ పురాణము చెప్పినందున 1. వరహక్షేత్రము అనియూ, సనత్ కుమారులు తిరునారాయణ పెరుమాళ్ళను ప్రతిష్ఠించుటచే తిరునారాయణ పురము అనియూ, ఈ క్షేత్రము కొండమీద వుండుటచే 2. నారాయణాద్రి అని, త్రేతాయుగమున దత్తాత్రేయమహర్షి వేదము పఠించి అందుచే అచట పుష్కరిణి ఏర్పడుటచే 3. వేదాద్రి అని, శ్రీ సీతారాములు వనవాసకాలమున ఈ క్షేత్రమున వసించుటచే దీనికి 4. సీతారణ్యక్షేత్రం. ద్వాపర యుగమని శ్రీ బలరామకృష్ణులు (యదుకులమున అవతరించినవారు) రామప్రియన్ వుత్సవమూర్తిని ప్రతిష్ఠించుటచే 5. యాదవాద్రి, యాదవగిరి అనియూ, కలియుగమున స్వామి పునఃప్రతిష్ఠ చేసినందున 6. యతిశైలం అని, సమీపకాలమున కృష్ణరాజవుడయార్ తురుష్కుల బాద ఈ క్షేత్రమునకు లేకుండుటకై ఈ క్షేత్రము చుట్టూ కోట కట్టించుటచే 7. మేల్కోట అనియూ పేర్లు కలిగెను.

## ఈ క్షేత్ర నిర్మాణము

బెంగళూరు నుండి ఉదయం 7 గం; 8 గం; మధ్యా. 2.30 గం. సాయంత్రం 5 గం. మేల్కోటకు నేరుగా బస్సులున్నవి. మిగతాసమయములలో మాండ్యలో దిగి కాని, జక్కనహళ్ళిలోగాని దిగి వెళ్ళవలెను. మాండ్యనుండి ఉ. 7 గం; 9 గం; సా. 5.30 గం వున్నవి; మైసూరునుండి ఉ. 6 గం; 7.30 గం, మ. 12.30; సా. 3.30; & 5.30 గం. నేరుగా బస్సులున్నవి. మిగతాసమయములలో జక్కనహళ్ళి క్రాసులో దిగి వెళ్ళవలెను.

కృష్ణరాజవుడయార్ సన్నిధికి తురుష్కుల బాధ లేకుండుటకై తిరునారాయణపురం చుట్టూ కోట కట్టించిరి. అది మొదలు మేల్కోట అని వ్యవహరింతురు.

తిరునారాయణపురం అని అడిగినచో బెంగుళూరు మైసూరు వారికి తెలియదు అందుచే ఆపేరు గల వూరే లేదు అందురు. అందుచే మేల్కోటె అని అడుగవలెను.

ఈ మేల్కోట సముద్రమట్టమునకు (SEA LEVEL) సుమారు 2000 అడుగులు ఎత్తున వున్నది.

బస్సుస్టాండుకు ప్రక్కన కల్యాణి తీర్థము వున్నది. ఈకోనేరు చుట్టు శ్రీ నంబివాది కేసరి అళగియమణవాళజియ్యరు మఠం; అహోబిల మఠం; అశ్వత్థ వృక్షం ఇచట నియమ నిష్ఠలతో ప్రదక్షిణం చేయువారికి పుత్రసంతానము కలుగును. జ్ఞానమభివృద్ధి అగును. కావున దీనికి జ్ఞానాశ్వత్థ వృక్షము అనిపేరు.

దానికి ప్రక్కగా పఞ్చభాగవత క్షేత్రము అని వున్నది. ఇచట శుకమహర్షి, అంబరీషులు, రుక్మాంగదులు, పుణ్డరీకులు, ప్రహ్లాదులు తపస్సుచేసి, సిద్ధిపొందిరి. వారు సిద్ధిపొందుటచే ఈ కోనేరుకు కల్యాణి అని పేరు పెట్టిరి. కరుణానారాయణస్వామి సన్నిధి, మహాశేషాశన సన్నిధి. దీనికి ప్రక్కన మైసూరు మహారాజుగారైన రాధాకృష్ణ ఒడయార్ మండపము, ప్రక్కన దారామండపము. ఇచట శ్రీ శెల్వాపిళ్ళైకు బ్రహ్మోత్సవము ముందుగా కల్యాణోత్సవము జరుగును. దానికి ప్రక్కన గజేంద్రస్వామి సన్నిధి వున్నది. ఇచట గజేంద్రమోక్ష వుత్సవము జరుగును. ప్రక్కన లక్ష్మీనరసింహస్వామి సన్నిధి. పెరియాళ్వార్ సన్నిధి, బిందుమాదవ సన్నిధి, శ్రీ వరాహస్వామి సన్నిధి, ఇచట భూదేవికి శ్రీ వరాహస్వామి కైశికపురాణం, చరమశ్లోకము సాయించిన స్థలమిది.

ప్రక్కన హయగ్రీవ సన్నిధియూ. శ్రీవేఙ్కటేశ్వరస్వామి సన్నిధియూ, దీనికి ప్రక్కన సీతాదేవి, శ్రీరామచంద్రులు, శ్రీలక్ష్మణ

స్వామి పర్ణశాల కట్టుకొని కొన్నాళ్ళు వాసముచేసిరి. దానికి ప్రక్కన నటనకృష్ణుని సన్నిధి వున్నవి, ఇవన్ని కల్యాణిగుంట చుట్టూవున్న మంతపములు సన్నిధిలు. ఇక శెల్వాపిళ్ళై సన్నిధికి వెళ్ళుదారిలో నమ్మాళ్వార్ సన్నిధి, బృందావనం, తిరుమంగై ఆళ్వారుల సన్నిధి, శ్రీ ఆఞ్జనేయస్వామి సన్నిధ కేశవస్వామి సన్నిధి కలదు. ఇచ్చట నుండి బజారువీధి ముగిసి, రాజవీధి ప్రారంభము అనగా సన్నిధి మాడవీధి తిరిగుటకు కునిగళ్ళువీధి. అందులో మన భగవద్ రామా మజకూటం, అష్టాక్షరీ మండపము వున్నది. దారిలో వసంతోత్సవ మండపము, శ్రీ ఆణ్డవర్ స్వామి మఠం, శ్రీ తిరుమల పెద్దజియ్యరు స్వామి మఠం, శ్రీ వేదాన్తదేశికుల సన్నిధి, సన్నిధికి ఎదురుగా శ్రీమత్పరమహంస పరివ్రాజక ఉభయవేదాన్త ప్రవర్తక శ్రీమాన్ త్రిదణ్డి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజియ్యరు స్వామివారు 1977 న స్వాధ్యాయ జ్ఞానయజ్ఞం జరిపి లక్షదీపోత్సవం జరిపి వేదత్రయీ అను స్తంభమును ప్రతిష్ఠించి అందు చతుర్భుజ శఙ్ఖ చక్రధర శ్రీ కృష్ణమూర్తి దివ్యమఙ్గళ విగ్రహ మూలవిరాట్టును ప్రతిష్ఠించిరి.

దానికి వెనుక వాహనమండపము దానికి ముందుగా గరుడాళ్వారుల మండపము వున్నది. ఈ పెరియతిరువడి సన్నిధిలో ధ్వజ స్తంభము ముందుగా కాక సన్నిధి రాజగోపురమునకు ఎదురుగా వీధి కట్టుప్రక్కగా వేంచేసి యున్నారు. కావున సన్నిధి ప్రక్కన వెళ్ళువారు చెప్పులు వేసుకొని గరుడాళ్వారులకు రాజగోపురమునకు నడుమగల వీధిద్వారా వెళ్ళకూడదు. ఆ గరుడమండపము చుట్టు కొని వెళ్ళవలెను. ఇక భక్తులు సన్నిధికి వెళ్ళునపుడు ఈ గరుడాళ్వారులకు ప్రదక్షిణముగా వెళ్ళవలెను.

వాహనమండపమునకు ప్రక్కగా బదరీ (రేగుపండ్ల) వృక్షము వున్నది. ఈ చెట్టుక్రింద నిలుచుకొని స్వామి తిరునారాయణ గర్భ గృహపుట్టను చూచిరి. ఈ స్థలమున నిలిచి చూచుటచే వీరికి ఆ